శ్రీచక్రేశ్వరదేవతాప్రసన్నము.



# దేవకీనందనశతకము

ఇయ్యది

బాపట్ల పురవాస్తవ్యులును, చెఱువు గ్రామకరణముగారును నగు

మ. రా. శ్రీ బాపట్ల వీరయామాత్య ప్రథమతనూజుండగు

బాపట్ల హనుమంతరావుచే

రచింపఁబడి

[illegible]లగీర్వాణేత్యాది బిరుదాంకితులును,

లావణికశాఖోద్యోగులును నగు

బ్రహ్మశ్రీ పెళ్లూరు

శ్రీనివాస రంగేశ్వర శర్మ శతావధానిగారిచే

పరిష్కరింపఁబడినది.

ప్రథమ కూర్పు. 500.

వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.

1923.

 [వెల 0—[illegible]—0

# పీఠిక

ఈ దేవకీనందనశతకము ఛావల్ల హనుమంతరాయకవి విరచితము. ఈయన దన స్వచరిత్రము నీ శతకమునఁ జివర రెండు పద్యములఁ దెలిపియున్నాఁడు. ఆంగ్లేయభాషాభ్యాసమునకుఁ దన బాల్యమునుంకువగ సమర్పించుచుండిన కాలమునుండియు గూడ నీయన మాతృభాషా చింతనము నేమరక కొనర్చుచు చిటిపొటి పద్యముల నల్లుచుండు నలవాటు గలిగియున్నాఁడు. తత్పరిశ్రమకుఁ దగిన ఫలము నీ దేవకీనందనశతక మవతారము గాంచినది.

ప్రబంధముల దండడి నెట్టుటో తప్పించుకొని, నాటకముల బూటకపు పాటల నోరమోమునఁ దృణీకరించి, నవలానవ కవితావల్లికల చిక్కుల నుక్కిరిబిక్కిరిగాకఁ ప్రాణముల దక్కించుకొని వర్తమానమున అల్లసల్లన బయలువెడలుచున్న సనాతన శతకవితానమునకుఁ దోడుగ నధునాతనకవికృత శతకసంతతియుఁ బ్రబలుట ఆంధ్రభాషకు శుభావహమనందగు శతకములవలని ప్రయోజనములను భాషాసంప్రదాయజ్ఞులగు పండితులు పెక్కుగు నిర్వచించియున్నారు. సలక్షణగ్రాంధి కాంధ్రభాష శుద్ధముగాక బుక్కడ్డముగ తిరుగుచున్నదను మాటలందందు వినవచ్చుచున్న యీకాలమున మేలగు తెలుఁగు పొత్తముల రచించు పడుచువాండ్రు చాలమంది యాంధ్రదేశమున గానవగు టెంతయు ప్రశంసాపాత్రము. క్రొత్తఁగ రచింపఁబడిన శతకములలో శాంకరీశతకము, శ్రీకృష్ణశతకము, శ్రీరామచంద్రశతకము, మున్నగునవి కొన్ని ప్రస్తుత దేశకాలపాత్రోచితముగ లలితశైలిని సొబగుమీరుచున్నయవి. పూర్వకవి విరచిత దేవకీనందన

శతక మొకటి యుండెనని వినుచున్నాముగాని దానిఁ జదువు భాగ్యము మనకు లభింపదయ్యెను.

తక్కుంగల యంశము లెటులున్నను హనుమంతరాయ కవి కవితాధార కొంతవఱకు నిరాటంకముగ సహజముగ సాగి నడచినదని యీ దేవకీనందనశతకమును బట్టి తెలియం దగు మఱియు నిక్కవి తన సహజభక్తిరసావేశము నంతయు నీ శతకముఖమున వెల్లడించియున్నాఁడు. ఇక్కవి కవిత్వమున కిది ప్రాథమికావస్థ గావునను, ఈతఁడు భాషాప్రపంచమున నింకను సంచరించి సంపాదింపదగిన యనుభవ మపారముగ నున్నది గావునను, పిన్నవయస్కుఁడగుటను అనిర్వాచ్యమగు నద్దియో యుత్సాహముచేఁ బ్రేరేపింపఁబడి రచింపఁబడిన దగుటను యీ దేవకీనందనశతకమునందుఁ బ్రమాదము లందందు దొరలుట సహజము గాకపోదు. అయినను నిక్కాలమున గ్రంథముల రచించు కొందఱవలె నెవిరో నాల్గుపదములఁ బులిమిపుచ్చక హనుమంతరాయకవి కొంత పరిశ్రమమూలమునఁ దన యీ చిన్ని గ్రంథమును వెలయించియున్నాఁడు. ఇందలి గుణలేశము ననుగ్రహించి గ్రహించి యీ బాలకవికి వాత్సల్యరస సమంచితాశీస్సులఁ బగపుదురు గాత యని విబుధవరులఁ వేఁడుచు, ధారాశుద్ధి మున్నగు సుకవితా పరిపాక సద్గుణముల నింకను అలవరించుకొని యాంధ్రభాషాసేవ యొనర్చుచుండఁ జిరాయురారోగ్యముల హనుమంతరాయకవికిఁ బ్రసాదింప నద్దేవకీనందనుని బ్రార్థించుచున్నాఁడ.

చీరాల,
**30–4–1923.**

ఇట్లు,
కొణిదెన బాలకృష్ణయ్య.

# విజ్ఞప్తి

కైతరచించుటకిదియె నాప్రథమ ప్రయత్నము. ఛందోలక్షణజ్ఞానమల్పము. దీన దోషశతమ్ములున్నవనుటకు సందియములేదు. కాన గుణగ్రహణ పారీణులగు పండితకవుల దీన దోషమ్ములు సైరించి నన్ను మన్నింప నే నెంతయుఁ బ్రార్థించెద. ఈ గ్రంథలేఖ నాప్రేరేపకులును మదీయప్రియమిత్రులునగు మ॥ రా॥ శ్రీ అబ్బరాజు వీరరాఘవయ్య కవిగారికిని ఈ గ్రంథంబుఁ బరిష్కరించి నాకెంతయు మేలొనఁగూర్చిన బ్రహ్మశ్రీ పెళ్ళూరు శ్రీనివాసరంగేశ్వరశర్మ శతావధాని గారికిని నన్ను ప్రోత్సాహపరచి పీఠికనొసంగిన మ॥ రా॥ శ్రీ కోణిదెన బాలకృష్ణయ్య కవిగారికిని నాకృతజ్ఞతాభివందనము లర్పించుచున్నవాఁడ.

బాపట్ల,
27-4-23.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
బాపట్ల హనుమంతరావు.

శ్రీమత్పర దేవతాపతయేనమః.

# దేవకీనందన శతకము.

శా॥ శ్రీరాజత్ప్రభ భావపత్తన మహా । సింహాసనాసీన! యో
శ్రీరామాయుత వక్షభాగ! విలస । త్సిందూరయుక్తాస్య! స
త్కారుణ్యామృత సిక్తభక్తనిచయా! । దారిద్ర్యసంహార! వి
స్తారోదార! కృతిన్ దయన్ గొనుము కృ । ష్ణా! దేవకీనందనా!

మ॥ కృశతన్ జూడుమటంచుఁ గానుకలన । ర్పింపన్ సమర్థుండఁగా;
నుపవాసంబులొనర్పఁ జాల; మదియం । నుత్సాహమా మెందు; త్వ
జ్జపసంధ్యావిధులాచరింతమనఁ జా । చల్యంబు హెచ్చాయె; నీ
శ! పరంధామ! యిఁకెట్లు ప్రోచెదవు! కృ । ష్ణా! ౨

మ॥ సరవిన్ నేరను శాస్త్రకావ్యసరణిన్ । ఛందోవిధానంబు; స
ద్గురుసంసేవనలబ్ధ వాణియున నెం । దున్ లేదు నాయందు; నీ
శ్వరునిన్ నమ్మి యలగించువాఁడనివిగో । శార్దూలమత్తేభముల్
హారసంసేవిత పాదవారిరుహా! కృ । ష్ణా! 3

మ॥ అరయన్ భక్తులపాలికల్పమనియం । దందున్ శ్రుతంబయ్యె; నీ
దరికిన్ జేరఁగ వాంఛగల్గెడి నదో । దారిన్ నన్ గాతువో
గురుసంసారమహాంబుధిన్ వయిచి సం । క్షోభంబుఁ గల్పింతువో
సరసీజోదర! నీదె భారమిఁకఁ । గృష్ణా! ౪

శా॥ శ్రీదంబై, సకలామరప్రకర సం । సేవ్యంబునై, శాశ్వతం
బై, దైత్యప్రతిభాప్రణాశకరమై, । యానందమై, నిత్యహే

లాదేదీప్యమునై, యచింత్యమయిలీ । లామానుషంబైననీ
దాదివ్యాకృతి నెంచ నాతరమె? కృష్ణా! ౫

మ॥ త్రిజగన్నాటకసూత్రధారివపురా! । దివ్యోన్నతప్రాభవా!
నిజశక్తిన్ ద్రిగుణాత్మతన్ జగములన్ । నిర్మించిపోషించి, నీ
వజగంబుల్ హరణంబుఁ జేయుదుమహా । త్మా! సర్వమున్ నీమయం
బజగంగాధర దేవదేవనుత! కృష్ణా! ౬

శా॥ పాపారణ్యదవానలా! సుకరుణా । పారీణ! విశ్వేశ్వరా!
భూపద్మాలయధార! ధీయుత! మహాం । భోరాశిగంభీర! శ్రీ
గోపాలా! శ్రితపాల! దేవవినుతా! । గోవింద! కంజాక్ష! మీ
వౌపాదాబ్జము లాశ్రయించితిని; కృష్ణా! ౭

మ॥ హరి! దైత్యాటవిదావపావక! శర । ణ్యానంద సంధాయకా
మురరాత్రించర శైలవజ్రధర! అం । భోజాసనాండోదరా!
కరిరాడాదిమ భక్తపోషణచణా! । గంభీరశుంభత్క్రియా!
స్మరియింతున్ దరిఁజేర్ప రాఁగదవె కృష్ణా! ౮

శా॥ శ్రీకాళీయభుజంగభోగమునఁ గ । జ్జెల్ ప్రేమాయనంఘ్రిద్వయిన్
వీకన్ నాట్యమునల్ప, గోపికలు సే । వింపన్ భవద్వేణునా
దాకూపారతరంగసంగతుల నా । హ్లాదంబుఁ గల్పించునిన్
సాకల్యంబుగ నెంతుఁ గావఁగదె; కృష్ణా! ౯

శా॥ శ్రీలావణ్యవరోవిలాస! కరుణా । సింధూ! జగన్మాన్య! ని
త్యాలంకార! ప్రభంజితాసురగణా । ధ్యక్షా! యశోదాత్మజా!
లీలామానుష విగ్రహాంచితకళా! । శ్రేయోవిశాలా! అనం
తా! లక్ష్మీధర! కావ రాఁగదవె; కృష్ణా! ౧౦

మ॥ అతిబాల్యంబుననుండి నిన్ గొలువఁ బ్రహ్లాదుండ నేఁ గాను; సం
తతముం మీ భజనంబు సల్పుటకు నే నా నారదుం గాను; సం
స్కృతకావ్యంబులు నీపయిం బలుకఁగా శ్రీవ్యాసుఁడం గాను; ప్రా
జ్ఞత నిన్ నమ్మితి నెట్లుగాచెదవొ? కృష్ణా! ౧౧

మ॥ అలపాంచాలి సభాస్థలంబున; "మహాత్మా! కావవే" నా దయా
కలితస్వాంతుఁడవై యొసంగితివి లక్షల్ కోట్లు వస్త్రంబులన్
బలుమార్గంబుల సన్నుతించెద నన్ బాలింపవేమయ్య; శ్రీ
శ! లవంతేనియుఁ బ్రేమ లేదుగద! కృష్ణా! ౧౨

శా॥ కాలుం డంతమునందుఁ బాశమున లాగన్ బ్రాణముల్ పోయెడా
వేళన్ నావశమౌనొ, కాదొ మిము సేవింపంగ; నేనిప్పుడే
శ్రీలక్ష్మీశ! యటంచు నీచరణముల్ సేవింతు నన్నేలఁగా
జాలంబేల? దయామతిన్ గనుము; కృష్ణా! ౧౩

మ॥ అరయన్ మీగుణమెంతొ సాత్వికము; క్షీరాంభోధి మీ స్థానమౌ
సిరి భార్యామణి; తల్పమాదిఫణి; రాజీవాప్తచంద్రుల్ కనుల్
సరసీజాసనుఁ డాత్మజుండు; భవదైశ్వర్యంబులిట్లుండ, నీ
శ్వర! మీభక్తులకే కొఱంతయిఁకఁ? కృష్ణా! ౧౪

మ॥ ప్రకటత్వద్గుణజాలముల్ బొగడు వక్త్రంబే ధరన్ వక్త్రమౌ
నకలంకా! భవదర్చనల్ సలుపు హస్తంబులే హస్తముల్
సుకరంబౌ మిముఁ జూచు నేత్రములె చక్షుల్; భక్తిమై నిత్యమున్
సకలం బీవను దేహి దేహి యగుఁ; కృష్ణా! ౧౫

మ॥ సకలస్థావరజంగమాదులను ని । స్సందేహతన్ నిల్చి; తా
వక భక్తాళినిఁ గాచియుందుదువు దే । వా! నీవహో, నామబిం
దుకళాతీతుఁడవై జెలంగెదవు; భ । క్తుల్ వేనవేల్ నీకృపన్
సకలార్థంబులఁ గాంచినారుగద; కృ । ష్ణా! ౧౬

మ॥ తొలి నేఁ జేసితి ఘోరకృత్యములనిం । దూషించితిన్ గోపినై
పలుదుర్భాషలనాడితిన్ బుధుల; నే । వన్ గంటిమీభక్తులన్;
ఖలుఁడీతండని ద్రోయకయ్య; జగదే । కత్రాణపారీణ! భూ
స్థలిమీపుత్రులలోన నే నొకఁడఁ గృ । ష్ణా! ౧౭

శా॥ మీదాసావళి దూరుపాపులను భూ । మిన్ గూల్చువప్పె! మి
మ్మా దాసాళియె దూరనప్పుడు వని । త్యానందసంపూర్ణతన్;
గాదా? ఆశ్రితపారిజాతమనులో । కఖ్యాతినిన్ గాంచలే
దా? దీనప్రతిపాల! తెల్పఁగదె; కృ । ష్ణా! ౧౮

మ॥ మనమన్ వారిధి; లోభ మోహ మద కా । మంబుల్ తరంగంబులున్
ఘనుఁడౌ జీవుఁడె కర్ణధారియగు; ప్ర । ఖ్యాతంబు మీ నామకీ
ర్తనమే పోతము; దానిమూలఁ గొనియీ । దారిద్ర్యదుఃఖంబులో
ననుమానింపక పాయువాఁడనికఁ; గృ । ష్ణా! ౧౯

మ॥ కలకాలంబును మిమ్ము దూరెడి మహా । కష్టాత్ములొక్కప్డు, చి
క్కులపాలై మిము నాశ్రయింపఁగ నయా । క్షుద్రాత్ములన్ గావవా?
అలకాకానురుఁ జెట్టఁబట్టినటు సా । త్యంబొక్కటే చాలు; వి
శ్చలభక్తిన్ స్మరియింపనేర్తునఁట? కృ । ష్ణా! ౨౦

మ॥ అనఘా!మిమ్ములఁబోలు దైవము నను,వి । ద్యావంతుఁడుఁ
దల్లియున్
జనకుండా ర్తశరణ్యారక్షకుఁడు; నే । స్తంబున్;దయాళుండు;స
జ్జనమార్గానుచరుండు;దాతయును బూ । జార్హుండు నెచ్చోటలే
డనులోకోక్తి నిజమ్ము భూస్థలిని; కృ । ష్ణా! ౧౧

మ॥ కడుమాధుర్యము రోసి వేయుఁదినఁగాఁ । గాంక్షించు పెన్మ్రాఁకు
నై వడి, యజ్ఞానులు పెక్కు వేల్పులకు సే । వల్ జేసి ప్రార్థింతురీ
పుడమిన్ ముక్తికి నీకు మ్రొక్కవలెస । న్మోక్షంబు పేక్షించినన్;
సడుగుల్ వేయి వచింపనేమగును ? కృ । ష్ణా ! ౧౨

శా॥ పుత్రుల్ లేరనిచింత నొందెదర యో । మూఢాత్ములై మాన
[వుల్
పుత్రుల్ లేకొకొకార వేంద్రునకు స । న్మోక్షంబుఁ జేకూర్చి రే?
పుత్రుల్ లేని శుకుండు గాంచఁడొకొ తా । మోక్షంబు నీ సేవకా
దా త్రైలోక్యము ముక్తిమార్గమిఁక? కృ । ష్ణా! ౧౩

శా॥ మేనన్ ప్రాణములున్న దాక కడుఁ గూ । ర్మిన్ సర్వ నేస్తమ్ములున్
మానంజాలక దాపుఁ జేరుదురు, సం । భాషింతు రాకాయమున్
ప్రాణంబుల్ దిగనాడినన్ గనఁగ భా । ర్యాపుత్రు లేరారు,ని
త్యానందుండగు మిమ్మెనమ్మనగుఁ; కృ । ష్ణా! ౧౪

మ॥ అతిబాల్యంబున మూఢతన్ మెలఁగి క్రీ । డాసక్తి యొప్పారఁగా
సతులన్ జూచుచు యౌవనంబున మదిన్ । జాంచల్యమే హెచ్చఁగా
నతివృద్ధుండయి శక్తిచాలమినిరో । గాదుల్ పయిన్ గప్పఁగా
హాతదై తేయ! మిము దలంచుటగునా? కృ । ష్ణా! ౧౫

మ॥ తలిదండ్రుల్ తరుణీసుతుల్ తనకు నూ। తంచున్ విమోహాతిరే
కలసన్మానసులై ప్రమూఢులగుచున్। గర్వాంబుధిన్ మున్గియా
యిలసర్వాత్మ, జగన్నియామకుని స। ర్వేశున్ మిమున్ బ్రొక్కి ని
శ్చలభక్తిన్ వరివస్యసల్పరిక; కృ। ష్ణా! ౨౬

శా॥ అంతంబై మరణించువేళఁ దనుడా। యన్ రారు సత్కాంతలీ
సంతానంబులు, దుఃఖసంభరిత సం। సారంబు సారంబుగా
స్వాంతంబందుఁ దలంచు మూఢులకు లే। శంబేనియుఁ దోఁచదీ
సంతాపంబెడఁ బాపసేవగతి; కృ। ష్ణా! ౨౭

మ॥ అనిశంబున్ దరుణీసుతాదులని మా। యాపూరితస్వాంతులై
ఘనదుర్మోహలతానిబద్ధులగు మూ। ర్ఖశ్రేణికే వేళనై
నను జింతింపఁగ శక్యమే సుజనమా। న్యంబైన మీమూర్తి; స
జ్జనహృత్పంకజచంచరీకవర! కృ। ష్ణా! ౨౮

మ॥ స్థిరకారుణ్యముఁ బొందఁ గోరి మిముఁ బ్రా। ర్థింపంగ మీభక్తులం
దఱు నేతెంచెదరంచు క్షీరనిధిమ। ధ్యంబందు నత్యంతభీ
కరశేషాహిపయిన్ బరుండితివ? స। ఖ్యంబెల్ల నిట్లుండ నీ
శ్వర! నీరూపము నెట్లుగాంచనగుఁ? కృ। ష్ణా! ౨౯

మ॥ క్షణమాత్రంబును విశ్రమింపఁడొకచో। గంజాప్తుఁడా సాగరుం
డణుమాత్రంబును మేర మీరఁడు జగ। త్ప్రాణుండు వీచున్ సదా
గుణభూయిష్ఠత శాంతిఁ దాల్చు ధర; మే। ఘుండిచ్చు వర్షంబు; నీ
వనముల్ లోకములున్ వడంకుఁగద! కృ। ష్ణా! 30

మ॥ తరుణీనాభికుచప్రదేశములమో। దంబార వీక్షించి, బం
ధురమోహావృతమానసాంబురుహులై। దోషాటులున్ మెత్తుర

స్థిరముల్ మానసవసాకులంబులు చుమన్ । జిత్తంబు నందెంచి యీ
చరణాబ్జంబులఁ గొల్వఁ బోకుగద! కృ । ష్ణా! ౩౧

మ॥ అరయన్ భాగ్యములున్న కాలమున డా । యన్ వత్తు రెవ్వార
లున్
బరమాహ్లాదముతో నిజాప్తులబలెన్ । భాగ్యంబులన్ బాయుచో
దరిఁ జేరన్ సమకట్టఁ డెట్టిహితుఁడున్ । దారిద్ర్యమున్ జూచి, మో
హారతిన్ ముంచెదవార పామరులఁ! కృ । ష్ణా! ౩౨

మ॥ విలసత్ కాంచనచేల! గోపవనితా । బృందప్రతీపాల! గో
కులనిత్యోద్ధ రణైకశీల! జితర । క్షోపాల! సల్లీల! కో
మలసీలాంగ విశాల! పాలితమహా । మానీంద్రసజ్జాల! ప్రో
జ్జ్వల శౌర్యాతిదయాలవాల! హరి! కృ । ష్ణా! ౩౩

మ॥ ధరణీపాలుని బిచ్చగాని బగిదిన్; । ధైర్యాత్ముని న్రిద్రాసనం
భరితున్ గా, నురుదాతనగ్ధుపగ; బ్రహ్మజ్ఞానునిన్ మూర్ఖుఁడౌ
కరణిన్; లోకులఁ దోలుబొమ్మలక్రియన్ । గల్పించి యాడింతు;
ది వ్యరసోన్నాటకసూత్రధారుఁడవు! కృ । ష్ణా! ౩౪

మ॥ అతిభక్తిన్ మిము నాత్మలోఁ దలఁచిన । ర్వావస్థలందున్ మహో
మతియుక్తంబుగఁ బూజలన్ సలిపి షే । ముంబిచ్చు మీమూర్తి సం
తతమున్ నమ్మి భజించు వారలకు మో । దం బారఁగా మీఁదుది
వ్యాశమంబా శుభరూపు గన్పడదె? కృ । ష్ణా! ౩౫

మ॥ ఘనమాయామిళితప్రపంచమను నీ । గాఢాంధకారంబులోఁ
గనఁజాలన్ మిము; లోభ మోహ మద రా । గ క్రోధ భూయిష్ఠమై
చెము నేత్రంబులఁ, గాన, జ్ఞాననయనా । బ్జంబీయు వే ప్రీతిమీ
మ్మనయంబున్ మనసార వేడెదను; కృ । ష్ణా! ౩౬

మ॥ పితృభక్తిన్ సుతులిచ్చు సేవలకు సం। ప్రీతాత్ముఁడై తండ్రియున్
సుతులన్ క్రమ్మఱ సౌఖ్యపెట్టుదురటుల్ । శుద్ధాత్ములే రేనిమి
మ్మతిభక్తిన్ భజియింపఁగాఁదిగి సౌ। ఖ్యంబిచ్చియవ్వారలన్
సతతంబున్ దయఁగాచియుండెదవు; కృ॥ ష్ణా! ౩౭

మ॥ పితశిక్షించిన మాత చెంతకరుగున్ । భీతాత్ముఁడై కుఱ్ఱఁడా
పిత నేజేరుచు మాతశిక్షసలుపన్ । విశ్వేశ! నీవల్గినన్
క్షితినీ వేతలిదండ్రివౌటనిఁక శి । క్షింపంగ రక్షింప, ను
న్నతి బొందింపఁగ నీవదిక్కుగద; కృ॥ ష్ణా! ౩౮

మ॥ అనిశంబున్ గనుక్షుద్రకృత్యముల । న్యాయంబుగానెంత
యో। ధనమార్జించిభుజింపకేపరులకున్ । దానంబుగానీయకే
చనునీచాత్ములగుండియల్ పగులనా। శంబౌనుతద్భాగ్యమీ
జనసంఘమ్ములకెట్టి దుర్గతియొ? కృ॥ ష్ణా! ౩౯

శా॥ కాయంబున్ విడిప్రాణిపోవునపుడున్ । గాసైనఁగానీతనన్
డాయన్ రాదఘపుణ్యకర్మములువెం। టన్ వచ్చునం చెంచఁడీ
మాయాప్రావృతమానవాధముఁడు స। న్మార్గంబుఁజూపింప
మీ। సాయంబున్ మదిఁగోరఁగాఁజనఁడు, కృ॥ ష్ణా? ౪౦

మ॥ క్రతువుల్ పెక్కులొనర్చినిర్జరులస। త్కారుణ్యమున్ గాంచిన
మ్మతిగంగాద్యవగాహనంబునవిరా। మంబాడి, గ్రామంబులన్
ధృతిమంతుండయి పెక్కుసత్రములుని। ర్మింపన్ మిముఁగాంచలేఁ
డతిభక్తిన్ మిముగొల్చువానిగతిఁ; కృ॥ ష్ణా ౪౧

మ॥ "అడుగందేయిడదమ్మయన్న" మనువా। క్యంబారయన్ మాకు
నీ। పుడమిన్ బుట్టకపూర్వమిచ్చితివి సం। పూర్ణంబుగావస్త్రముల్

తోడవుల్ భోజనముల్ విశాలగృహముం । దుర్వాసముం జేయుమి
మ్మదుగం దేయుదు సత్కృపామతివి! కృ । ష్ణా! ౪౨

మ॥ అరయం దాతలఁ దల్లిదండ్రులను భార్యాపుత్రులన్ మిత్రులన్
దరుణీరత్నములన్ గురూత్తములవి । ద్యావంతులన్ బెద్దలన్
ధరణీపాలుర నర్థులన్ గనినచో । ధర్మంబుఁ బోనాడ కే
సరణిన్ వర్తిలఁ బోలునో తెలుపు! కృ । ష్ణా! ౪౩

శా॥ కామముల్ పొందెడు వేళ భక్తినిమముల్ । స్వాంతంబునం దెంతు
రా! కాముల్వాసి సుఖమ్ములం దెమతత్రిన్ । బ్రార్థింపఁగా నోపరీ
భూమిన్ గష్టములన్ శుభంబులమన । స్ఫూర్తిన్ మిముల్ గొల్వగా
స్వామీ! నాకు వరంబొసంగఁగదె! కృ ష్ణా! ౪౪

మ॥ భవరోగంబున నేను జంతునరరూ । పంబుల్ ధరన్ దాల్చుమీ
కవమానంబది గాదె? నమ్మితినిమున్ । స్వాంతంబునన్ భక్తిమై
భవరోగార్తి మహాభిషగ్వరుఁడవై । బాధంబులన్ బాపవే
జవసత్వంబులు మేననుండఁగనె! కృ ష్ణా! ౪౫

మ॥ మనవారల్ పెరవారలంచు మదిసం । భావింత్రు; వీరందఱో
యనఘా! మీకు సమానులౌదురుగ! మా । యావార్థినిర్మగ్నులై
గనఁగా వేరరు దీనియామఁగలసూ । త్నంబెంతయున్, దీనర
క్షణధుర్యా! అనివార్యశౌర్య! హరీ! కృ । ష్ణా! ౪౬

మ॥ అరిషడ్వర్గము నాభయాహవములో । వ్యాఘ్రంబులన్ మోక్షు
మం! దిరముల్ గావలిఁ గాయనిల్పితివిపీ । నిన్ జెండినన్ గాని మీ
గుఱుది వ్యాకృతిఁ జూడఁ జాలనిఁక నా । కున్ వాటిఁ గూల్పంగ సం
స్ఫురణంబున్ దెలుపంగ దే కృపను! కృ । ష్ణా! ౪౭

మ॥ అవనిన్ భాగ్యమునీవొసంగఁగ ఫలం। బాద్రవ్యము ల్ చేర్మినీ
యవలన్ దానక రూపసద్విధులఁ దే। వా! త్వత్కృపాలబ్ధస
త్కవితన్ మీగుణ రాజినిత్య మతిశాం। తన్ బద్యరూపంబుగా
స్తవముల్ జేయఁగఁ దత్ఫలంబగును। కృ ష్ణా! ౪౮

మ॥ క్షితినాథుండొక చిన్ని రాజ్యమునుర। క్షింపంగదా నెంతయో
వెతలొందున్; బదునాల్గులోకములసం। ప్రీతాత్మతన్ గాచునీ
వెతలింతింతని చెప్పనాకుఁదరమే। పృథ్వీజనౌఘంబులో
నతిమందుండను జ్ఞానశూన్యుఁడను; కృ। ష్ణా! ౪౯

శా॥ లేశంబైన లభింపఁగోటియనుచున్ లెక్కింప లేనట్టిఘో
రాశాపాశనిబద్ధచిత్తులకు హే। మాద్రిన్ సమర్పింపనా [ఆ
యాశాబంధముఁ ద్రెంపఁజాలుదు రెవీ। ధ్యానంబు చేఁదక్క; 
శాశుండాలన్ నృసింహామీ వెగద! కృ। ష్ణా! ౫౦

మ॥ సతతంబిచ్చునులచ్చిమీ సకియవి। స్తారంబుగాఁగల్మి; మీ
సుతుఁడౌ పద్మజుఁడీ యునాయువతిద। స్తుండై సమస్తంబుమీ
తనయా వాహ్నవిజే యుఁ బావనము; తా। సుధ్ధాత్ముఁడౌ చున్
నసుం
డతిభక్తిన్ మిముఁగొల్వ నేగాదువ? కృ। ష్ణా! ౫౧

మ॥ చిటిపాయంబున స్నేహితుండవని, నిన్। జేరన్ ధనాకాంక్షియై
యటుకుల్ గానుకగానొసంగు చుఁగుచే। లాఖ్యావనీదివ్యుఁడా
యటుకుల్ గుప్పెడు దిన్న యంత నెయఖం। డైశ్వర్యముల్ గల్గె; నా
న్నటికిన్ మీరె సమర్థులన్నిఁటను కృ। ష్ణా! ౫౨

శా। వాకన్నన్ ఖలుఁడున్ మదాంధుఁడునునిం। దాదూరుఁడున్
గ్రూరుడున్
మీకన్నన్ బరమాత్మఁ డార్యుఁడు జగ। న్మిత్రుండు సంభావ్యుఁడున్
లోకారాధ్యుఁడు గానరాఁడు; మిముశు। శ్లోకున్ మదిన్ గొల్తు నీ
శా! కారుణ్యముఁ జూపి బ్రోవఁగదె; కృ। ష్ణా! ౫౩

మ। పరదారామణులన్ ధనంబుల హరిం। పన్ జూచు దుర్మార్గులం
దఱుమ పాశములతో నిబద్ధులు మదో। న్మత్తుల్ రవంతేని తా
రెఱుఁగన్ జాలరు దండహస్తుదరిసే। న్యేశీ పాలాదురో
శరణంటిన్ నను నెట్లుగా చెదవొ? కృ। ష్ణా! ౫౪

మ। నీవే తల్లివి తండ్రివాచును సదా। నీపాదపద్మంబులన్
భావంబందు నభక్తి నిల్పి పదనీ। పన్ జేసెదన్ గావవే
రావే యాశ్రితుఁ; బ్రోవవే వినతు; సం। రక్షింపవే దీను; దే
వా! వాత్సల్యముఁ జూపవే కరుణఁ; కృ। ష్ణా! ౫౫

మ। అనఘా మీకడ భక్తుఁడం మమదియం। దాహ్లాదమున్ జెం
దునా
తని కే వేళ శుభంబుఁ గూర్తు విజకృ। త్యంబంచుఁ; బార్థుండుమున్
రణరంగమున మిమ్ముఁ గోర రథసా। రథ్యంబుఁ జేయంగ వే
చనవే? ఆశ్రితపారిజాతనగ! కృ। ష్ణా! ౫౬

శా॥ క్షీరాంభోధి నివాసమై దనర ల। క్ష్మీదేవి యర్థాంగిగా
ఘోరాహీంద్రము పాన్పుగాఁ గలిగి శం। ఖున్ చక్రమున్ దాల్చిన
త్కాగుణ్యాంబున భక్తశేఖరుల వీఁ। కన్ బ్రోచు మీమూర్తి నిం
పారన్ జూపి శుభంబుఁ గూర్పఁగదే! కృ। ష్ణా ౫౭

శా॥ అంభోజాసనవాసవాగ్నియమచం।ద్రార్కాలకేశుల్ మ
హా॥శంభుండాదిగ దేవతల్ నిజపదా। బ్జాతంబులన్ వ్రాలసం
రంభంబూని కృపాళుఁడయ్యెదవు; ను। ర్వారుండనౌ పాతకిన్
సంభావింపవె నన్ను సత్కరుణఁ గృ। ష్ణా గిర [హారీ]

మ॥ ఘనసంసార పయోధిమోహమను న। గ్రగ్రాహదంష్ట్రా
దనువుల్ స్రుక్కఁగ, రాగలోభమదమా।త్సర్యాళినాభంగముల్
నను బీడింపదొడంగె; దిక్కఁకజగ। న్నాథుండవీ వేగదా!
అనఘా! యేవిధినొడ్డుఁ జేర్చెదవొ! కృ। ష్ణా! ౫౯

మ॥ అవనిన్ భూరిభవంబునాఁబరగు ఘో।రారణ్యమధ్యంబునం
దవివేకంబను దుష్పథంబునను గ।ట్టా! క్రుమ్మరన్ జిత్తసం
భవుఁడన్ క్రూరమృగంబువాతఁబడి యే।మార్గంబు నేఁగాన, నిన్
స్తవముల్ జేతుఁబక్షంబుఁజూపఁగదె! కృ। ష్ణా ౬౦

మ॥ చని, ఘోరంబునగాధమైదనరు సం।సారాంధకూపంబునన్
ఘనదుఃఖాహిశతంబు పాల్పడి, తదు।గ్రక్రూరదంష్ట్రాహతిన్
దనువున్ డస్సినుస్రుక్కఁ బ్రాణములు, నిన్ ధ్యానించెదన్ భక్తి
మై। నను రక్షింపవె దీను. నాశ్రితునిఁ గృ। ష్ణా! ౬౧

మ॥ ఘనసంసారదవాగ్నిలోఁ బడఁగ ను।గ్రజ్వాల లెంతేనినా
తనువున్ గాల్పభవత్కృపారసము మో।దంబారఁ బ్రోక్షించినా
కనపాయంబగు మార్గమీయఁగదె;వి। శ్వాత్మాజగద్రక్ష
కా॥ అనిశంబున్ దమపాదముల్ గొలుతుఁ గృ।ష్ణా! ౬౨

మ॥ జలజాతాయతనేత్ర! ఘోరమగు సం।సారంబునా నొప్పు పెన్
జలధిన్ గూలి విమోహభంగములనో।జన్ జిక్కితిన్ గాన, మీ

విలసన్నామ జపాఖ్యపోతమున సంప్రీతిన్ దరిన్ జేర్పవే;
అలఘుక్ష్మాధరధీర! దేవనుత! కృష్ణా! ౬౩

శా॥ ఏకాలంబున దండహస్త భటులే నేకాకినై యుండఁగా
నేకర్మంబులఁ జేసితంచు నను నే యేరీతి శిక్షింతురో
మీకన్నన్ దగునాప్తుఁడింకెవఁడు? సామీ నేశ్రితుండన్ సదా
నాకై వారలఁగాచి యుండఁగదె కృష్ణా! ౬౪

మ॥ అరయన్ లోభవికామరాగములచే నంధత్వమున్ బొందఁద
స్కృతులౌ యింద్రియముల్ వివేకమును నా సంబంధమా ద్రవ్యమం
తరహీన్ దోఁగిలి మోహకూపమున వంతన్ బొందనన్ ద్రోసిరో
సరసీజాక్ష! కరంబు నీయఁగదె? కృష్ణా! ౬౫

మ॥ "అసురాళిన్ ధరమోవఁజాలనని" బ్రహ్మన్ జేరఁగోరూపియై
వసుధన్ జూచి విరించి చింతిలి మిమ్మున్ బ్రార్థింపఁగా దేవకీ
వసుదేవేశునకున్ జనించి యసుర వ్రాతంబు జెండాడితీ
వసమానుండవు సర్వలోకములఁ గృష్ణా! ౬౬

శా॥ "బాలుండా! యిదెక్షీర" మంచు వడిగాఁ బాలిండ్లు మీ
నోటిలో
వాలాయంబుగ నుంచఁ బూతనను నీవంటన్ వెసన్ బ్రాణముల్
గ్రోలన్ గూలె ధరాధరంబు పగిదిన్ గోపాలకుల్ భీతిమై
నాలోకించఁగఁ దచ్ఛవంబపుడు! కృష్ణా! ౬౭

మ॥ ఒకనాఁడాకలినొంది పాలకొఱకై "యోతల్లి" యంచేడ్వఁగా
నొకరున్ మీదెసఁ జూడకుంటఁగని కోపోద్దీపితాత్ముండవై
సకలోర్వీస్థల మల్లలాడునటు కంసప్రేరితుండైన త
చ్ఛకటాఖ్యాసురుఁ గూలఁదన్నితివి, కృష్ణా! ౬౮

మ॥ అనఘా! తల్లి యశోద, కూర్మి నొకనాఁ । డంకంబునన్ జేర్చి, నీ
కనురాగంబునఁ జన్ను బాలొసఁగ నా । త్యంతంబుతో నావులిం
చిన, మీ నోటన జాండమెల్ల గని యా । ర్భిల్లెన్ మహాభీతయై
చనుమీ మోమును జూడఁ జాలమిని, కృ । ష్ణా! ౧౯

శా॥ తల్లీ! కృష్ణుఁడు మట్టి బొక్కెననుచున్ । దా శాంకముఖ్యుల్ వడిన్
సల్లాపంబున నా యశోదసతి కా । సక్తిన్ వచింపంగ వే
'కల్లల్ పల్కిరి చూడు' మంచు సకల । త్ప్మాచక్రమున్ కుక్షియం
దల్లాడన్ గనుపింపఁ జేసితివి కృ । ష్ణా! ౨౦

మ॥ పెఱ గోపాలుర యిండ్ల జొచ్చి హితులున్ । వెన్వెంట రా దత్తతన్
బెఱుగుల్ వెన్నయు పాలు గ్రోలి కడవల్ । భేదించి వర్యార్త్తి "త
స్కరుఁడా! నిల్వు ముకొట్టువార" మనుచున్ । గాంతామణుల్ పిల్వ మీ
చరణాబ్జంబుల మొట్టితీవు మును కృ । ష్ణా! ౨౧

మ॥ ఒక గోపీమణి 'పాలుద్రావె యితఁడం' । 'చోయమ్మ! నన్గొట్టె' నం । చొకరున్ "సర్పము మీఁద వైచె" నని వే । రొక్కర్తు మీ క్రీడలం
బొకఁ దెల్పన్ జెయి మోడ్చి "యో జనని! యే । పాపంబు నే జేయలే
దకలంకుండ" నటంచుఁ బల్కితివి కృ । ష్ణా! ౨౨

శా॥ ఆలన్ దోలుక గోపబాలకులు దా । హార్తిన్ జలాన్వేషులై
కాళిందీతటమందుఁ గూలఁ గృపతో । కారాధ్యులా మీర లా
యాలన్ గోపుల లబ్ధజీవులను జే । యన్ దోషితస్వాంతులై
బాలంగాఁ గొనియాడి రెల్లరును; కృ । ష్ణా! ౨3

శా॥ కాళిందీనదిలోనఁ జొచ్చి వడినా । కాళీయునిన్ బట్టి, దు
ష్కేలాభీలవిశాల దుర్భరవి । షాగ్నిజ్వాలలున్ రక్తమా

మూలాగ్రంబుగ గ్రక్కు గ్రొక్కి భుజగంబుల్ రూపుమాయిం
చుదై! ర్యాలంబు ండవు నీవుగావె! హరి! కృ ష్ణా ౭౪

శా॥ మీరుర్ మిత్రులరణ్యమధ్యమునఁ జేరి గ్రీడలన్ సల్పఁగా
ఘోరంబైన దవానలంబుఁగని మీకుర్ గ్రమ్ముక్కి భీతిన్ మిముర్
జేరన్ ధైర్యముఁ జెప్పియా, దవశిఖన్ జేపట్టియున్ గ్రోలితీ
వౌరా! యెంతటి సాహసుండవొకో? కృ ష్ణా! ౭౫

మ॥ రమణుల్ దాజలకంబులాడుటకు సంరంభంబునన్ గట్టు వ
స్త్రములన్ దీరమునందునుంచి, నదిలో స్నానంబుఁ జేయంగ, నా
యమునాతీరముడాసి, వస్త్రములవా స్యార్థంబు గొంపోయి వృ
క్షము పైఁ జేరిచి కూరుచుంటివట; కృ ష్ణా! ౭౬

శా॥ అంతన్ గోపకులాంగ నామణులు "కృ ష్ణా! నీకు మేల్గాదు, నీ
వంతింబీ వనితాళిపైఁ దగునో కో వస్త్రంబులన్ దెమ్మికన్
జింతన్ మమ్ములముంచవద్ద"నుచు జేజేల్ సల్పఁగా నమ్మికన్
సంతోషంబున వల్వలిచ్చితివి; కృ ష్ణా! ౭౭

మ॥ 'గిరికిన్ మ్రొక్కిరి నాకు మ్రొక్కరిపుడీ కృష్ణుండు ప్రేరేపగన్
గరువంబెక్కనుయాదవాళికని" వేగన్ వజ్రపాల్ వర్షమున్
గురిపింపన్ వ్రజవాళి రక్షణకునై గోవర్ధనగ్రావమున్
నరగన్ ఛత్రముమాడ్కిఁ బట్టితివి; కృ ష్ణా! ౭౮

శా॥ ఘోరుండౌ వృషభాసురాగమమునన్ గోపాలకుల్ భీతులై
వారేకంబుగ మిమ్ము సాయమునకై ప్రార్థింప నాదైత్యుదు
ర్వారోదంచిత శృంగముల్ పెకిలిగీ రక్తంబునన్ వానిసం
హారంబున్ వడిఁ జేసి తీవుమును; కృ ష్ణా! ౭౯

మ॥ అనఘా! మిమ్ముల జంప నెంచి మదిలో । నక్రూరునిం బంపినన్
జనవేషాదరులౌచుఁ గంసుపురమున్ । శౌర్యోద్ధతిన్ మిమ్మెది
ర్చిన దుష్టాత్ముల రాక్షసాధములకే । శివ్యోములన్ జెండి, స
జ్జనమాన్యుండవునై చెలంగితివి; కృ । ష్ణా! ౮౦

శా॥ మీ రంతన్మధురాపురంబుఁ జనఁగా । మీరూపమున్ గుబ్జయుం
పారంజూచి విలేపనంబులిడి పా । దాంభోజముల్ బట్టఁగా
నాశామామణి వక్రదేహమును ది । వ్యాకారమున్ జేసితీ
వౌగా! యెంతటి సత్కృపాళుఁడవు! కృ । ష్ణా! ౮౧

శా॥ క్రూరాత్ముండగు కంసుఁ జేరిదనుజల్ । క్షోభిల్లఁ గేశంబులన్
శూరత్వంబునఁ బట్టియీడ్చి సమర । క్షోణిన్ బడన్ద్రోసి, ము
ర్వ్యారోదంచితముష్టిఘాతవితతిన్ । బ్రాణంబులన్ గొంటి, నా
నారాజన్యులు మిమ్ములన్ బొగడఁ! కృ । ష్ణా! ౮౨

మ॥ అరయన్ బూర్వభవంబులం దేఁబలమి । మ్మర్చించి ప్రార్థించిరో
వరుఁడున్ శంతనపుత్రుఁడున్ విదురుఁడున్ । నందవ్రజశ్రేణియున్
గరియున్ ద్రౌపదియుం గుచేలుఁడును పా । తూద్విష్ణు మిమ్మున్ నిరం
తరమున్ జూచుచు సంతసించుటకుఁ! కృ । ష్ణా ౮౩

శా॥ భామారత్నము రుక్మిణీమణి మిమున్ । స్వాంతంబునన్ గోరి మీ
పైమీ మాటము చేత బ్రాహ్మణునిబం । పన్ సంతసంబంది, వే
భూమీశుల్ మగధాధిపాదులను సం । పూర్ణంబుగా గెల్చి, యో
స్వామీ! రుక్మిణిఁ జెట్టఁబట్టితివి! కృ । ష్ణా! ౮౪

మ॥ నరకుండాదిగ రాక్షసాధములు సే । నాయుక్తులై వేల్పులన్
మురమౌఁదున్ విదళించి నట్టడవిఁగా । దోలంగ, నిన్ జేర నా

సురసంఘంబులకున్ సహాయముగ ర।క్షోనాథులన్ గూల్చి,ని
ర్జరులన్ గూరిమి గాచినావుగద! కృ।ష్ణా! ౮౫

మ॥ అనఘా! మీరలు బాంధవంబునను స।ఖ్యత్వంబునన్ దేవ్వైనె
ననుగన్పింపరు; శత్రులైనమిము ధ్యా।నంబూని సేవించినం
తనె ధన్యాత్మునిఁ జేతురంచు వినెదన్ । దథ్యమ్ముగా మిమ్ము స
జ్జనసంసేవిత పాదు నేఁగొలుతుఁ; గృ।ష్ణా! ౮౬

మ॥ దనుజేంద్రుండగు సోమకాసురుఁడు వే।దంబుల్ సురజ్యేష్ఠు వ
ద్దనుజౌర్యమ్మున సంగ్రహించి జలధిన్ । దాచంగ మత్స్యాకృతిన్
ఘనతన్ దానవుఁ గూల్చి వేదముల వే।గన్ దెచ్చి యాధాతకున్
జనినీవిచ్చితివయ్య, లోకనుత! కృ।ష్ణా! ౮౭

మ॥ సురలున్ దానవులందఱేగి యహిరా।జున్ ద్రాడుగాఁ బట్టి మం
దరమున్ గవ్వముగాఁ బయోనిధి వే।ద్రచ్చంగ ఘోరార్భటిన్
గురునీరేజభవాండ మాకులపడన్ । గూర్మంబవై మందరన్
సరగన్ మూపునఁ దాల్చినావుగద! కృ।ష్ణా! ౮౮

మ॥ తనకన్నన్ బలవంతులెవ్వరనుచున్ । ధాత్రీసతిన్ జాపఁగా
దనదోశ్శక్తినిఁ జుట్టివైవఁ గిటివై। దైత్యున్ హిరణ్యాక్షు మీ
ఘనశౌర్యమ్మున రూపుమాపి నిజశృం।గంబందు భూదేవినో
యనఘా! నిల్పితివెల్లరున్ బొగడఁ; గృ।ష్ణా! ౮౯

మ॥ హరియేడీ? యిటఁ గంబమందుఁ గలఁడా? । ఆక్రూరునిన్
[జూపుమం
చరిదైత్యుండు, హిరణ్యకశ్యపుఁడు ప్ర।హ్లాదున్ వడిన్ దన్నఁగా

నరసింహాకృతిఁ దాల్చి "కంబమునను।న్నా" నంచు ఘోరంబుగా
నరిని న్గోరులఁ జీల్చి వైచితివి; కృ।ష్ణా! ౯౦

మ॥ చటులాశన్ బలిచక్రవర్తి సురరా।జ్యంబున్ గొనన్ జూచినన్
వటువై యా బలి జన్నమందు ధరణిన్।బాదత్రయం బడ్గి యం
తట విశ్వాకృతిఁ దాల్చి దానవునిఁ బా।తాళంబునన్ జేర్చి యా
రటు రాజ్యంబును వజ్రికిచ్చితిరి; కృ।ష్ణా! ౯౧

మ॥ ధరణీపాలుర నెల్లరన్ దునుమఁ।జేతన్ గొడ్డలిన్ దాల్చి భీ
కరుఁడౌ భార్గవరాముఁ డీతఁ డనిలో।కంబుల్ ప్రశంసించఁగా
నిరువై యొక్కటిఱుల్ నృపాలవరులన్।హింసించి తద్రక్తని
ర్ఝరిచేఁ బైతృకతర్పణం బిడితి! కృ।ష్ణా! ౯౨

మ॥ వఱలన్ దాటకిఁ దున్మి భర్గుధనువున్।భగ్నమ్ముగాఁ జేసి, సీ
తరమన్ బెండిలియాడి తండ్రికయి సీ।తాదేవియున్ నైజసో
దరుఁడున్ వెంబడి రామహాటవిని దై।త్యౌఘంబులన్ రావణున్
సరగన్ జెండిన రామమూర్తివిగ! కృ।ష్ణా! ౯౩

మ॥ చిఱునవ్వుల్ దళుకొత్త మోము పయిఁగ।జ్జెల్ మ్రోవ నంఘ్రి
ద్వయిన్
సరసీజాక్షుల గోపికామణుల రా।సక్రీడలన్ దేల్చి, ము
ష్కరకంసాదినిశాచరాధముల వీఁ।కన్ జెండి శిష్టావళిన్
సరవిన్ బ్రోచితి రాధికారమణ! కృ।ష్ణా! ౯౪

మ॥ సురసంఘంబు నుతించఁగా ధరణిర।క్షోనాధులన్ గూల్ప వా
హారుసాయమ్ముగ బుద్ధమూర్తివయి యా।రాతార కాపుత్రులన్

దురమందుం జదలించి దేవతల సం।తుష్టాత్ములం జేసి తో
నర శార్దూల! ఘనాభగాత్ర! హరి! కృష్ణా ౯౫

మ॥ కులముల్ దోషసమాకులంబులగుచుం।గ్రూరత్వమే పారఁ
గా। కలికాలాంతమునందు మీరు గరిమం।గల్కాకృతిం భూమి
వేల్పులయింటం జనియించి ఘోటకముపైఁ।బొల్పొంద గాన
క్కవి।ద్యాలుతో దుష్టులఁ గూల్చువాఁడవట కృ।ష్ణా! ౯౬

మ॥ మనముందూహాలు తగ్గి శోకమును పే। మాంద్యంబుచే నెంత
యుం। దను వెల్లం గృశియించు పూర్వమె, భవ।త్పాదాబ్జముల్
చిత్తమం।దనిశంబుం స్మరియింపఁ గల్గునపుడే,।ఆర్యా! మిముం
జేరనా। జ్ఞను నాకిమ్మని నిన్ను వేడెదను; కృష్ణా ! ౯౭

మ॥ తలిదండ్రిం సతి పుత్ర సోదరులనా। ప్త।శ్రేణినిం బంధులం
కలకాలంబును సౌఖ్యపెట్టుచు భవ।త్కారుణ్యముం గాంచఁ బూ
జల నెల్లప్పుడుఁ జేసి యంత్యమున మీ।సాన్నిధ్యముం బొందని
శ్చలమా కూర్మి వరంబొసంగఁగదె? కృష్ణా! ౯౮

మ॥ సుతుఁడే వైన నువచ్చి రానిపలుకుల్।సొంపారఁగాఁ బల్కి నన్
మతి నూహించి ముదంబుఁ జెందు జనకుం।డా మాడ్కి మిమ్ముం గోరి
మీ శతకంబుం లగియించినాఁడ నిటఁదో।సంబున్న సైరించి స
న్మతి భావంబు గ్రహింప వేడెదను; కృష్ణా! ౯౯

మ॥ అనిశంబుం భవదీయ పద్యశతకం।బాద్యంతముం వ్రాసినన్
వినినం భక్తిని బాడినం గలుగు వృ।ద్ధిం భోగభాగ్యంబులుం
ఘనపాపంబులు బాయు, రోగముడుగుం। గైవల్యమే చేరు వై
చను, సత్కీర్తియొసంగు, మీకృపను; కృష్ణా! ౧౦౦

శా॥ భారద్వాజపవిత్రగోత్రజుఁడ, నా । పస్తంబసూత్రుండ, వి
స్ఫారంబైచనుషట్సహస్రకులుఁడన్ । బాపట్లవంశీయుఁడన్
వీరామాత్యునకంబపున్నమకుఁ బృథ్విన్ బుత్రకుండన్ సదా
చారుండౌ హనుమంతనామకుఁడఁ గృష్ణా! ౧౦౧

మ॥ ధరణిన్ దుందుభిమార్గశీర్షమున, నేఁతత్పూర్ణమీయిందువా
సరమందిట్టులపద్యసచ్ఛతకమా । సాంతంబుగాఁబల్కి మీ
చరణాబ్జంబులకిచ్చినాఁడఁ గొని, యా । చంద్రార్కమున్ దే
యుమీ। శ్వరపాకారిముఖామరాదినుత! కృష్ణా ౧౦౨

శ్రీకృష్ణార్పణమస్తు.

